

# బ్రహ్మసూత్రాలు

- శ్రీ ఓంకారానంద బ్రహ్మచారి,
శ్రీవ్యాసాశ్రమము.

**అద్వైత ప్రమేయాలు :-** శ్రీభగవత్పాదులు అద్వైత ప్రమేయాలను తెలిపారు. అవి :-

1) బ్రహ్మ 2) జీవుడు 3) మాయ 4) మోక్షం

**1) బ్రహ్మ :-** సజాతీయ విజాతీయ స్వగత భేదరహితమైనది బ్రహ్మ. **'సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయమ్'** అని శ్రుతి ప్రమాణం. అద్వైతులు ఆత్మనే బ్రహ్మగా చెబుతారు. ఈ బ్రహ్మ రెండు విధాలు. 1) సగుణబ్రహ్మ 2) నిర్గుణ బ్రహ్మ. ఇటువంటి బ్రహ్మను నిర్వచించటానికి రెండు లక్షణాలను చెబుతారు ఆచార్యులు. **1) తటస్థ లక్షణం- "యతో వా ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని జీవన్తి యత్ ప్రయత్ అభిసంవిశన్తి తత్ బ్రహ్మ తత్ విజిజ్ఞాసస్వ". 2)స్వరూప లక్షణం-** సత్యం, జ్ఞానం, అనంతం బ్రహ్మ. ఈ రెండు లక్షణాల చేత సగుణబ్రహ్మ, నిర్గుణ బ్రహ్మ యొక్క స్వరూపం తెలియజేశాడు ఆచార్యులు.

**సత్త్వరజతమోగుణాత్మకమైన మాయా కార్యాలచే జీవుడు ప్రతిక్షణం గ్రసింపబడుతు దుఃఖాన్ని పొందుతున్నాడు. అంతేకాకుండా తనస్వస్వరూప స్థితిని మరచి కర్తృత్వ, భోక్తృత్వాభిమానుడై జన్మపరం పరను పొందుతున్నాడు. అవిద్య తత్ కార్యాలు నశించాలంటే భగవంతుని తప్పక శరణుజొచ్చాలి.**

**2) జీవుడు :-** అద్వైతులు జీవునికి వేరు వేరు లక్షణాలు చెప్పారు. వేదాంత పరిభాషానుసారం అంతః కరణావచ్ఛిన్నచైతన్యం జీవుడు. సర్వజ్ఞముని కార్యోపాధి జీవుడని చెప్పాడు. ప్రకటార్థవివరణకారులు అవిద్యయందు చిత్ ప్రతిబింబం జీవుడని చెప్పారు. శ్రీ శంకరులు శరీరేన్ద్రియపంజరాధ్యక్షుడు కర్మఫల సంబంధి జీవుడని చెప్పాడు.

బ్రహ్మయే అవిద్యచే గ్రహింపబడినప్పుడు జీవుడిగా వ్యవహరింపబడుతున్నట్లుగా ఉన్నాడు. ఆ అవిద్య తొలగిపోగానే 'బ్రహ్మ'గా ప్రకాశిస్తాడు.

**3)మాయ :- "రజస్తమోఽనభిభూత శుద్ధ సత్త్వప్రధానామాయా"** రజస్తమోగుణాలచేత అణద్రొక్కబడని శుద్ధమైన సత్త్వగుణం ఏ మూల ప్రకృతిలో ప్రధానంగా ఉంటుందో అది మాయ. **"యా మా సా మాయా"** ఏదైతే లేదో అది మాయ. మాయ త్రిగుణాత్మకము. త్రిగుణాత్మక మైన మాయను జయించాలంటే భగవంతుని శరణు వేడాలి. అందుకే శ్రీకృష్ణ పరమాత్మ అంటాడు-

**దైవీహ్యేషా గుణమయీ**
**మమ మాయా దురత్యయా।**
**మామేవ యే ప్రపద్యన్తే**
**మాయామేతాం తరన్తి తే॥** అని.

**అవ్యక్తనామ్నీపరమేశశక్తిః అనాద్యవిద్యా త్రిగుణాత్మికా పరా। కార్యానుమేయా సుధియైవ మాయా యయా జగత్సర్వమిదం ప్రసూయతే॥**

అవ్యక్తమను పేరు కలదియు, పరమేశ్వరుని శక్తియైనదియు, ఆదిరహితమగు అవిద్యయు, త్రిగుణస్వరూపము కలదియు, పరమైనదియు అగు మాయ మంచిబుద్ధికలవాని చేతనే కార్యమును బట్టి ఊహింపదగినది. ఈ మాయచే సమస్తమైన జగత్తు పుట్టింపబడుచున్నది. ప్రపంచ కార్యాలన్నీ కూడా మాయ సంబంధింతమని తాత్పర్యము.

అద్వైత సిద్ధాంతంలో మాయను నిర్వచించటం చాలా జటిలమైన విషయం. అందుకే మాయ అనిర్వచనీయం. **అనిర్వచనీయమనగా?** సత్, అసత్, సదసత్ కంటే విలక్షణమైనది అని అర్థం. ఉదాహరణకు మరుమరీచికం.

**4)మోక్షం:-** ధర్మార్థకామమోక్షములని నాలుగు పురుషార్థములు గలవు. పురుషునిచేత కోరబడుట వలన వీటికి పురుషార్థములని పేరు. ఈ నాలుగు పురుషార్థములలో మోక్షమే **(మోక్షమనగా? బంధాత్ ముచ్యతే ఇతి మోక్షః''** బంధం నుండి విడిపోవడమే మోక్షం) పరమ పురుషార్థము. మోక్షమును పొందినవాడు మరల తిరిగిరాడని **"న స పునరావర్తతే"** అని శ్రుతి చెప్పుటచే అది నిత్యము. మిగిలిన ధర్మార్థ కామములు మూడునూ అనిత్యములు. **"తద్యధేహకర్మ చితోలోకః క్షీయతే" "ఏవమే వాముత్రపుణ్య చితోలోకః క్షీయతే"** అని శ్రుతి. ఈ లోకములో ధర్మాధర్మ రూప కర్మములచే ఏర్పడిన లోకము ఎట్లు నశించునో, అదే విధముగా స్వర్గాది లోకము నశించును. అనుటచేత ధర్మార్థకామములు అనిత్యములు. మోక్షమే పరమపురుషార్థము కాబట్టి దాని కోసం మనం ప్రయత్నించాలి. అప్పుడే మానవజన్మ సార్థకమవుతుంది.

**ప్రతివారు శాశ్వతానందరూపమోక్షాన్ని కోరుకోవాలి. మరి ఆ 'మోక్షం' ఎలా లభిస్తుంది అంటే "సమిత్ పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్'' అంటూంది శ్రుతి. శ్రోత్రియబ్రహ్మనిష్ఠులను ఆశ్రయించి, వేదాంత తత్త్వాన్ని బాగుగా తెలుసుకోవాలి. అప్పుడే మోక్షం "కరతలాబిల్వం" అవుతుంది.**

ఆత్మస్వరూప అవబోధనే మోక్షము. సచ్చిదానంద స్వరూపమే మోక్షము. ఈ మోక్షము ఉత్పాద్యము కాదు నిత్యం అవ్వడం వల్ల, వికారము కాదు అవికార్యము అవ్వడం వల్ల, ఆప్యము కాదు పొందబడి ఉండడం వల్ల, సంస్కార్యము కాదు నిత్యశుద్ధం అవ్వడం వల్ల. ఈ విధముగా 'మోక్షము' ఉత్పాద్య, వికార, ఆప్య, సంస్కార్యముల కంటే భిన్నమైనది.

**ప్రస్థాన త్రయం:-** వేదాంతశాస్త్రం మనకు పూర్తిగా అవగతం అవ్వాలంటే తప్పకుండా ప్రస్థానత్రయం గురించి తెలుసుకోవాలి. 1) ఉపనిషత్ ప్రస్థానం 2) స్మృతి ప్రస్థానం 3) న్యాయ ప్రస్థానం.

**1) ఉపనిషత్ ప్రస్థానం :-** ఆధ్యాత్మిక జగతిలో ఉపనిషత్తుల యొక్క మహత్వం వర్ణనాతీతం. మోక్ష సాధక హేతుభూతములు ఉపనిషత్తులు. వేదాల యొక్క అంతిమ భాగమే ఉపనిషత్తులుగా చెప్పబడు తున్నాయి. ఉపనిషత్ ప్రతిపాద్య విషయం జీవేశ్వర ఐక్యత్వం. అత్యంత భయంకర మృత్యురూప సంసారం నుండి బయటపడదలచిన ప్రతి ముముక్షువు ఉపనిషత్ వేద్య పరమాత్మను తెలిసుకోవాలి.

**ఉపనిషత్ శబ్దార్థం -** **"సదేర్ధాతోః విశరణగత్యవసాదనార్థస్యోపనిపూర్వస్య క్విప్ ప్రత్యయాన్త స్వరూపముపనిషత్ ఇతి."** ఉపనిషత్ అను పదములో ఉప, ని, షత్ అను మూడు మాటలు గలవు. 'షద్‌ల్' అనునది ధాతువు. ఈధాతువునకు విడిపోవుట, ప్రాప్తి, నాశము అను మూడర్థములు గలవు. ఉప, ని అనునవి రెండును ఉపసర్గలు. ఈ మూడు మాటలకు 'క్విప్' అను ప్రత్యయమును చేర్చగా 'ఉపనిషత్' అను పదము నిష్పన్నమగును.

**"ఉపనిషదితి విద్యోచ్యతే తచ్ఛీలినాం గర్భజన్మజరాదినిశాతనాత్ తదవసాదనాద్వా బ్రహ్మణో వా ఉపనిగమయితృత్వాత్ ఉపనిషణ్ణం వాఽస్యాం పరంశ్రేయ ఇతి".** ఉపనిషత్ అనగా విద్య ఇట్టి విద్యను పొందిన వారికి జరామరణాద్యనర్థజాతము నశించుట వలనను, బ్రహ్మమును పొందించుటవలనను, ఈ విద్యయందు పరమశ్రేయస్సు నిహితమై ఉన్నది కనుక ఉపనిషత్ అనగా బ్రహ్మవిద్య. ***(సశేషం)***